




## మంచి కిక్ ఇచ్చే మాటలు




## రవికిషోర్ మల్లాప్రగడ

# ఉల్లేఖనాల సంకలనం

(60% స్వానుభవం, 40% సంకలనం)

*మంచి కిక్ ఇచ్చే మాటలు*

రవికిషోర్ మల్లాప్రగడ

సహకారం : అంతర్జాలం

వెల : చదివి, అర్థం చేసుకొని పాటించవలసినవి

మొదటి ముద్రణ : మార్చ్, 2019

డి.టి.పి. : ఈశ్వరాంబ స్టూడియో

**Free Download : Kinige.com**

## ఈ పుస్తకం ఎలా చదవాలి?

*అన్ని ఉల్లేఖనాలు పరీక్షకు వెళ్ళే విద్యార్థిలా ఒక్కసారే చదవకూడదు.*

*మనస్సు చికాకుగా ఉన్నప్పుడు, లేదా హాయిగా ఉన్నప్పుడు*

*ఓ 10-15 నిమిషాలు కొన్ని పేజీలు చదవండి.*

**చదవడం ముఖ్యం కాదు. వాటిని జీవితంలో అమలు చెయ్యడం ముఖ్యం.**

**క్రింది నిర్వచనాలే ఈ ఉల్లేఖనాలకు సోపానం.**

**ENJOY** : ఎంజాయ్ చెయ్యడం అంటే కాలాన్ని తెలియకుండా గడపడం. అది వర్తమానంలో మాత్రమే ఉంటుంది.
మీరు క్రికెట్‌లో ఓ రన్నింగ్ క్యాచ్ పడుతున్నారు.
ఆ మూడు సెకెండ్లు ప్రపంచాన్ని మరచిపోయారు.
అలాగే మీరు ఓపిక్‌నిక్‌కి వెళ్ళేరు. విశ్వాన్ని మరచిపోయి పిక్‌నిక్‌లో ఇన్‌వాల్వ్ అయిపోయారు.

**HAPPY** : హ్యాపీగా ఉండటం అనేది గతంలో మాత్రమే ఉంటుంది.
హ్యాపీ సంఘటనలు జ్ఞాపకంలో మాత్రమే ఉంటాయి.
అంటే స్పృహతో హాపీగా ఉండటం జరగదు.
హేపీనెస్ అనేది భూత:కాలంలోనే ఉంటుంది.
ఎంజాయ్‌మెంట్ హాపీ సంఘటనగా మారుతుంది.

**పిసినారి** : తినకుండా దాచేవాడు – సంఘపరంగా తన వాటా వచ్చేసరికి మొహం చాటేసేవాడు. (పిసినారి = లోభి)

**కక్కుర్తిగాడు**: తినకుండా దాచుకునేవాడు, వేరే వారి నుండి ఉచితంగా ఆశించడు. ఎందుకంటే తాను తిరిగి చెల్లించాల్సి వొస్తుందని. సుమారుగా మనమందరం కక్కుర్తిగాళ్ళమే.

**డబ్బు** : డబ్బు అంటే ఓ ఐడియా, కరెన్సీ నోటు కాదు. దాన్ని కాలంతో కొలవాలి.

**చదువు** : చదువు అంటే డిగ్రీలు కావు. ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చేది.

**ప్రేమ** : ప్రేమ అంటే అర్ధం తెలిస్తే ఇన్నివేల సినిమాలు రావు.

**ఆరోగ్యం** : మనం సంపాదించుకోగలది.

**అనారోగ్యం**: మనం మాత్రమే బాగు చేసుకోగలది, డాక్టర్లు బాగుచేయలేనిది.

**పట్టుదల** : It’s a POSITIVE word.

**మూర్ఖత్వం** : It’s a NEGATIVE word.

***LoC (Line of Control)** బావుంటేనే ఏ ఫిలాసఫీ అయినా చెల్లుతుంది.
వీధి తలుపులు గడియ పెట్టుకుంటేనే నిద్ర పడుతుంది.
అలాగే **LoC** దగ్గర శాంతి ఉంటేనే ఫిలాసఫీ పని చేస్తుంది. గమనించగలరు.

# ఉల్లేఖనాల సంకలనం

***మంచి కిక్ ఇచ్చే మాటలు***

(60% స్వానుభవం, 40% సంకలనం)

1) అన్నిటి కంటే పెద్ద సమస్య - నాకు ఏమిటి కావాలో నేను తెలుసుకో లేక పోవడం..?

2) విజయ భ్రాంతి లోనే మనం బ్రతుకుతూ ఉంటాం. విజయానికి, విజయ భ్రాంతికి తేడా తెలుసుకోవడం, దాదాపుగా దుర్లభం, ప్రయత్నించండి.

3) ఏ సంఘటనకైనా మనల్ని పాడు చేసే శక్తి ఎంత ఉందో, బాగు చేసే శక్తి కూడా అంతే ఉంది.

4) మధ్య తరగతి వ్యక్తులకు నిర్ణయాలు ఉండవు. ఉత్ప్రేరకాలు మాత్రమే ఉంటాయి. తద్వారా ఉత్ప్రేరక నిర్ణయాలు ఉంటాయి. No decisions. Only emotions. Decision will be taken on emotions.

5) సంఘర్షణలని తెలివితో పరిష్కరించుకోండి. తేలిక హృదయంతో నిద్ర కోసం పక్క ఎక్కండి.

6) ఉత్ప్రేరక మాటలకు కాలం చెల్లింది. ఉత్ప్రేరక పనులకే హవా!

7) కార్పొరేట్ గురువులు, ఆధ్యాత్మిక గురువుల మధ్య మనం బ్రతుకులు వెళ్ళదీస్తున్నాము. (అంటే మన బ్రతుకులు వాళ్ళ చేతుల్లోకి వెళ్ళిపోయాయి)

8) మూర్ఖత్వం అనేది పుట్టుకతోనే రావాలి తప్ప, మధ్యలో అలవర్చుకునేది కాదు.

9) అయితే చాణుక్యుడి అర్థశాస్త్రం చదువు, లేదా విష్ణుశర్మ పంచతంత్రం చదువు లేదా వేమన శతకం చదువు. అంతే కాని వ్యక్తిత్వ వికాస పుస్తకాలు పట్టుకు కూర్చోక.

10) జీవిత కార్యకలాపాలను నిర్ధేశించేవి భౌతిక కారణాలు, దేవుడు, పాపం, పుణ్యం అనేవి మన నమ్మకాలు మాత్రమే (భౌతికములు కావు)

11) నీ చేత నేను పనిచేయించుకోవడానికి చెప్పే మాటలు – "మానవునికి ఒక విజయం – జీవితానికి ఒక లక్ష్యం"

12) దేవుడు INVENT చేయబడ్డాడు, DISCOVER చేయబడలేదు. కానీ DISCOVER చేయబడ్డాడని నమ్మబలుకుతాం.

13) "ఈ లోకం తనకు ఏమీ సహాయం చేయలేదని" మెజారిటీ ఈ లోకం మీద కక్ష పెంచుకుంటారు. పర్యవసానంగా మైనారిటీ సుఖపడతారు.

14) సర్వేంద్రియానాం నయనం ప్రధానం, ఇది పూర్తిగా తప్పు, సర్వేంద్రియానం కర్ణం ప్రధానం, కళ్ళు లేకపోతే సింపథీ దక్కుతుంది. అదే చెవులు వినపడకపోతే తిట్లు, శాపనార్థాలు, విసుగు, కోపం విరివిగా దొరుకుతాయి.

15) పాలు ఇచ్చే గేదెలు, పాలు త్రాగే మనుష్యులు గడ్డే తింటారు.

16) హెల్త్ కోసం డాక్టర్ దగ్గరకు వెళ్ళోద్దు.

న్యాయం కోసం కోర్టుకు వెళ్ళద్దు.

గౌరవం కోసం పోలీస్ స్టేషన్ వెళ్ళద్దు.

17) మనం జీవితంలో సంపాదించే డబ్బుకు మనం 'సంరక్షకులం' మాత్రమే! We are the custodians of the money we earn.

18) దానం చెయ్యడానికి రెండు వస్తువులు ఉండాలి, అందులో మొదటిది దానగుణం.

19) నుదుట మీద నుండి స్వేదము జనించే వాడే ఆహారం తినడానికి అర్హుడు. (అంటే సంపాదించి తినాలి)

20) నిద్ర లేవగానే పనిలోకి వెళ్దాం అని అనిపిస్తే – ఆరోగ్యంగా ఉన్నట్టే!

21) Give me half hour exercise per day through YOGA, I will give you 23 ½ hours.

22) భూమి వాస్తు సరిగ్గా లేదు. 23.5 డిగ్రీలకు బదులుగా 26 డిగ్రీలు ఉండి ఉంటే ఈ అసమానతలు, టెర్రరిజం,రోగాలు మొదలగునవి ఉండేవి కావు.

23) నిఖార్సయిన జీవిత సత్యాలు :

దేవుడు అబద్ధం - గుళ్ళు, హుండీలు నిజం.

చట్టం అబద్ధం - పోలీసు నిజం.

న్యాయం అబద్ధం - లాయరు ఫీజు నిజం

న్యాయస్థానం అబద్ధం - జైలు నిజం

ప్రజాస్వామ్యం అబద్ధం - చట్ట సభలు నిజం.

నీతులు అబద్ధం - లాభ, నష్టాలు నిజం.

సత్య హరిశ్చంద్రుడు అబద్ధం - స్మశానం నిజం.

ఆత్మ, అంతరాత్మ అబద్ధం - శరీరం, వంచన నిజం.

24) దురలవాట్లు మనిషిని సీదా చేస్తాయి. జీవితం మీద కంప్లయింట్లు చెయ్యడు.

25) అవమానింపబడటం ఒక అదృష్టం. అందులోంచి బయట పడలేక పోవడం దురదృష్టం.

26) ఒకరిమీద ఒకరు పెత్తనం చెలాయించడానికి చేసిన ప్రయత్నాల సారాంశమే మానవ నాగరికత చరిత్ర.

27) కులం, గోత్రం, నీతి నియమాలు, పరువు మర్యాదలు, మొదలగునవి మానసిక పెత్తనాలు.

28) అమ్మినపుడు లాటరీ టిక్కెట్లు అమ్మాలి గాని, బెనిఫిట్‌షో టికెట్లు కాదు.

29) చదరంగం ఆట అయిపోయిన తరువాత రాజునీ, బంటునీ ఒకే పెట్టెలో పడేస్తారు – రిటైర్ అయిన వ్యక్తుల పరిస్థితిలా.

30) సన్యాసులను సైతం ఆకర్షించే గుణం డబ్బుకు ఉంది.

31) కష్టపడి పనిచెయ్యడం. మన కాళ్ళమీద మనం నిలబడడం, మన బుద్ధి మీద మనం ఆధారపడటం, వీటి మీద మనకు గౌరవం లేదు కాబట్టి, రాజకీయ నాయకులు, బాబాలు మనల్ని ఏలగలుగుతున్నారు.

32) మనిషిలో ప్రవహించే గుణం ఉంది. అందుకే కమ్మవారు, రాజులు రాష్ట్రంలో సంపన్న ప్రదేశాలకు విస్తరించారు.

33) చెడ్డను భరించలేని వ్యక్తి మంచి రోజులు వచ్చేవరకూ బ్రతకలేడు.

34) ఒక నియమంగా దేవుని స్తోత్రిస్తాము. భయపడుతున్నట్లా? లేక నమ్ముతున్నట్లా?

35) మనకి ఉచిత భోజనం అంటే మక్కువ, అందుకే పెళ్ళిల్లు, చావులు అంత ఆర్భాటంగా జరుగుతాయి.

36) వాట్సాప్ వొచ్చేక వింతలూ, విడ్డూరాలు, నమ్మలేని నిజాలు పెరిగాయి. మిరాకిల్స్ మన జీవితాలకు అవసరమా? ఆలోచించండి.

37) మన సాంప్రదాయ విద్యా వ్యవస్థ మనకు ఊడిగం చేయటం నేర్పుతోంది. అందుకే మన జీవితాల్లో క్వాలిటీ లేదు. [Apple has a manufacturing unit in China but not in India]

38) ఆరోగ్య, వ్యాయామ పద్ధతులను సరిగ్గా పాటించండి. ఆరోగ్య సమస్యను ఆర్థిక సమస్యగా మారనివ్వకండి.

39) యువతీ యువకుల మధ్య ప్రేమ ఒక సొగసు కత్తి.

40) దేవునికి దక్షిణ వేసి అర్హత లేనిది కోరుకుంటున్నంత కాలం – జాతి ముందుకు వెలుతుందా..?

41) ప్రజల నమ్మకాలే కొందరికి పెట్టుబడి.

42) ప్రజలకు ఇతరులను నమ్మే దుర్గుణం ఉంది. ఆ దుర్గుణాన్ని ఉపయోగించుకొని, నువ్వు పెద్దవాడివి కావచ్చు. (Example: Hitler, Gandhi, స్వామీజీలు...)

43) వైఫల్యంతో క్రింత పడిపోతున్నప్పుడు, నీతో సమానమైన వాళ్ళమధ్య పడేలాగ జాగ్రత్తపడు.

44) Money is more powerful than Creative Intelligence. సృజనాత్మక శక్తి కంటే ఎక్కువ శక్తి డబ్బుకు వుంది.

45) తెలవైనవాళ్ళు నోటిని తినడానికీ, పొగడ్డానికి మాత్రమే ఉపయోగిస్తారు.

46) ఫ్యాన్ కనిపెట్టినవాడు మేధావి, దాన్ని తిరగేసి ఎగ్జాస్ట్ ఫ్యాన్ కనిపెట్టినవాడు మహామేధావి.

47) తలలు బోడులైనంత మాత్రాన తలపులు బోడులు కాకుండా జాగ్రత్త పడండి. తలపులు మంచివి కానప్పుడు పది తలలు ఉన్నా ఉపయోగం లేదు.

48) అడుక్కు తినేవాడి పట్టుదల గమనించు. మరి సంపాదించేవాడికి ఎంత పట్టుదల ఉండాలి.

49) ఒకడు పది రోజులు తినడం కాదు. పది మంది ఒక రోజు తినాలి. ఇదీ సాంఘిక న్యాయం.

50) రోఉల్ మోడల్ ఉపయోగంలేని మాట. రోల్ డ్యూటీస్ ఉపయోగపడే మాట.

51) ఇన్ని ఆరోగ్య సూత్రాల నడుమ ఏది ఫాలో అవ్వాలి? ఏది తిన్నా, మీ ఆకలిలో నల్గవ వంతు మాత్రమే తినడం బెస్ట్ అని గుర్తించండి.

52) కష్టపడి చదివాను, కష్టపడి సంపాదించాను అని అంటాం, కానీ కష్టపడి క్రికెట్ ఆడాను, కష్టపడి సినిమాకు వెళ్ళొచ్చాను, కష్టపడి సెక్స్ చేశాను అని అనరేమీ?

53) విలువలను గౌరవిస్తాము. జై కొడతాము. కానీ ఆచరించం. భగత్ సింగ్ పక్క ఇంట్లో పుడితే బావుండును అని కోరుకోవడంలో ఆంతర్యం ఇదే.

54) నష్టం వొచ్చినప్పుడు ఆనందించండి. నష్టాన్ని పూరించు కోవడానికి మరింత పనిచేసే అవకాశం సృష్టించబడింది అని గ్రహించండి.

55) మరణం తథ్యమని మన:పూర్తిగా నమ్మగలిగితే బద్ధకం పోతుంది.

56) నిజమైన బద్ధకస్తుడు అదృష్టంమీద ఆధారపడడు. దేవుడిని నమ్మడు.

57) డబ్బు ఖర్చు చేయలేని వాడు (కక్కుర్తి గాడు) అక్రమ సంబంధాలు నెలకొల్పుకోలేడు.

58) విజయంతో జత కడితే అక్కడే ఆగిపోతాం. అదే ముసలితనం.

59) దాత, ధర్మమూర్తి, అబద్ధం చెప్పడు, మాట తప్పడు, పరాయి సొమ్ము ఆశించడు, మొదలగు మాస్కుల వలన ఇతరుల మీద ఆధిపత్యం త్వరగా సంపాదించవచ్చు. అవి మాస్కులు కావని, విలువలు అని నమ్మేవారు అడవులు పట్టిపోతారు.

60) మీరు ఒక గడిలో తెలివైనవాడుగా నిర్ణయింపబడితే, మీరు ఇంక ఆ గడి నుండి నేర్చుకోవలసినది ఏమీ లేదన్నమాట.

61) ఏద్దైనా కొనేటప్పుడు కళ్ళనే నమ్ము, చెవులను కాదు.

62) పూర్తి శాఖాహారుడైన హిట్లర్ పెద్దగా చదువుకోలేదు. మరి కోటిమందికి పైనే ఎట్లా చంపించాడో?

63) పాప పుణ్యాలు కాలక్షేప విలువలు

64) అప్పును కూడా సంపాదన అని భ్రమ పెట్టి బ్యాంకులు మనకు హౌసింగ్ లోన్లు ఇస్తుంటాయి.

65) సూర్య చంద్రులు, ఎండా వానలు, రుతువులు మీ కోసం, మీ సౌకర్యం కోసం సృష్టించబడ్డాయి. [Today is made for you]

66) నిన్నటిని మరచిపోలేని వాడికి రేపు అనేది ఉండదు.

67) విజయం ఒక్కడికే చెప్పు (నీతో నువ్వు), ఓటమి ఇద్దరికి మాత్రమే చెప్పు (అడిగిన వాళ్ళకి, అడగని వాళ్ళకి).

68) మొట్టమొదటిగా కావలసిన పెట్టుబడి.

యుద్ధానికి – ధైర్యం.

బిజినెస్ కి – టైం.

69) నువ్వు వయస్సులో ఉన్నప్పుడు యవ్వనం రక్షిస్తుంది. ముసలితనంలో డబ్బు మాత్రమే కాపాడుతుంది.

70) స్వాతంత్ర్యం తరువాత అందరూ గాంధీని వొదిలి, నెహ్రూ కాళ్ళ దగ్గర పడ్డారు. అలాగే NTR పదవీచితుడు అయ్యాక అందరూ CBNకు మొక్కేరు. కాలానుగుణంగా ప్రాధాన్యాతలు మార్చుకోవాలి.

71) మనుష్యులందరూ పుట్టుకతో నాస్తికులే. అవసరం కొద్ది ఆస్థికులుగా మారి అది స్థిరత్వం చేసుకున్నారు.

72) జ్ఞానం ఎవరైనా ఇస్తారు. భోజనం మాత్రం నువ్వే సంపాదించుకోవాలి.

73) నమ్మకాలు, మూఢనమ్మకాలు అని విడివిడిగా ఉండవు. మన నమ్మకాలను నమ్మకాలని, ఎదుటివాళ్ళ నమ్మకాలను మూఢ నమ్మకాలని పిలుస్తాం.

74) ఏడు సార్లు ఓడిపో తప్పులేదు. కానీ ఎనిమిదోసారి ప్రయత్నించక పోడవం తప్పు.

75) లేళ్ళలో బంగారు లేళ్ళు ఎలా ఉంటాయి అన్న ఇంగిత జ్ఞానం లేకుండా పోయింది సీతకు. (అంటే ప్రలోభాలకు లోనవ్వకు)

76) బహుమతులు స్వీకరించి రుణగ్రస్తులు కాకండి. ఇది ఒక తెలియని మూర్ఖత్వం.

77) బ్రతుకు లోని మాయ – ప్రదర్శిస్తే మనకు లాభం. ఆశ్చర్యపోతే మనకు నష్టం. ( ఈ విషయం బాబాలకు బాగా తెలుసు)

78) ఎదుటివాడు ఏమన్నాడో అనే దానికి పదిశాతం విలువ ఇవ్వాలి. ఎందుకన్నాడో అనేదానికి తొంబై శాతం విలువ ఇవ్వాలి.

79) ప్రశాంతంగా ఉన్నవాడే గురి తప్పకుండా బాణం వేయగలడు.

80) చెవిటి వాడికి మాట్లాడేవాడంటే లోకువ. అందుకే మళ్ళీ చెప్పమంటాడు.

81) కాలం అందరి కంటే గొప్ప గురువు. కానీ అది శిష్యులను కూడా తినేస్తుంది.

82) యుద్ధం ఎప్పుడూ ప్రారంభానికి ముందే మొదలై, ముగియడానికి ముందే ముగిసిపోతుంది. (ఒకసారి భార్య భర్తల కోట్లాటను గమనించండి)

83) నోరు మూసుకోవాల్సిన సమయం ఏదంటే, నువ్వు ఏదైనా చెప్పాలని అనుకుంటావే అప్పుడన్నమాట.

84) తప్పుడు నిర్ణయం నుంచి అనుభవం పుడుతుంది. అలాగే అనుభవం నుంచి మంచి నిర్ణయం చేసే నైపుణ్యం పుడుతుంది.

85) యుద్ధం చేసి సంపాదించిన విజయం ఘోరమైన యుద్ధం కంటే ప్రమాదకరం (అంటే ఆ విజయంలో శాంతి ఉండదు)

86) సామాన్య ప్రజలకు అందలం మీద ఒక రకమైన మోజు ఉంటుంది. అందుకే పనికిమాలిన వాళ్ళు మనల్ని ఏలుతున్నారు.

87) దురదృష్టవంతలను చేరదీస్తే జీవితం నాశనం అయిపోతుంది. దుదృష్టవంతులైన కర్ణుడు, శకుని, భీష్ముడు ని అక్కున చేర్చుకున్న దుర్యోధనుడు ఏమయ్యాడు?

88) బానిసల్ని కొనడం, అమ్మడం తప్పుగానీ, బానిసల్ని కలిగియుండటం తప్పుకాదు.

89) మీ ముత్తాత ఎంత పొడుగున్నాడో అన్నది అప్రస్తుతం. మీ రెంత పొడుగున్నారనేది ప్రస్తుతం.

90) తెలివి కలవాడు ఇతరులతో వాదించడు. ఆచరణలో తన సిద్ధాంతం కరెక్ట్ అని రుజువు చేస్తాడు.

91) తప్పు చేయకుండా ఉండటం ఎంత ముఖ్యమో, చేసిన తప్పును ఒప్పుకోవడం కూడా అంతే ముఖ్యం.

92) ఎదుటివాడి బలహీనతలు తెలుసుకోవడం మనకి లాభదాయకమేమో గానీ, మన తెలివి, మన బలం అవతలి వాడికి తెలియడం వల్ల మనకి ఎలాంటి లాభమూ ఉండదు.

93) ఆకాశం నీదీ కాదు, నాదీ కాదు, దానిని నీకు ఇవ్వలేను. నువ్వడిగిన మూడడుగుల నేల భూమి మీద తీసుకో, ఆ మూడోకాలు దించు అని బలి చక్రవర్తి చెప్పాలి, బలవ్వకుండా! (అంటే జీవితంలో బేషజాలు వొద్దు అని అర్థం)

94) ఎక్కువమంది ఎందుకు వాదిస్తారంటే తమ జ్ఞానాన్ని ప్రదర్శించుకోవడానికి, తమ పాండిత్యాన్ని ప్రదర్శించుకోవడానికి ఇదరులను కించపరచడానికి, చుట్టూ ఉన్నవాళ్ళ దృష్టి ఆకర్షించడానికి లేదా పొద్దుపోవడానికి వాదిస్తారు.

95) తమ గొడవ తప్ప మరేదీ పట్టించుకోని వ్యక్తులు కులాసాగా, భద్రంగా ఉంటారు. మనం వారిని స్వార్ధపరులనీ, యోగ క్షేమాలు పట్టించుకోని వారని ఆడిపోసుకుంటాం.

96) వాళ్ళ ముందే వాళ్ళ జీవితం గురించి డిస్కస్ చేయడం వలన పిల్లలు చవటల్లా తయారౌతారు.

97) ఆకలికి మెడిసన్ - ఆహారం మాత్రమే (అంటే మెడిసన్ లా మితంగా తినాలి)

98) దేవుడు అవకాశాలను మాత్రమే ఇస్తాడు, వాటిని వరాలుగా (లేదా శాపాలుగా) మనమే మార్చుకోవాలి.

99) ఎవరైనా హెల్త్ గురించి అదే పనిగా మాట్లాడుతూ ఉంటే వారికి ముసలితనం వచ్చినట్లే.

100) నిస్పృహని శ్వాసించగలిగితే – శాంతిని శాశ్వతం చేసుకోగలుగుతాము.

101) గ్రీన్ లైట్ ఆరిపోతుందేమోనని ఉరుకుతాం. అందుకే గ్రీన్‌లైట్ డేంజర్. రెడ్ లైటు ఆరిపోగానే ముందు నేనే ఉంటాను. ఐ లవ్ యు రెడ్ లైట్!!

102) ఎంత ఎక్కువ మంది స్నేహితులు ఉంటే అంత ఎక్కువ అబద్ధాలు ఆడవలసి వొస్తుంది.

103) సహనం ఆహార్యంగా కలిగిన వారికి లవర్స్ ఎక్కువ మంది ఉంటారు.

104) కోపం, అసూయ, ద్వేషం, పొగరు మొదలగునవి దేవుడు కల్పించిన అద్భుతమైన ఉత్ప్రేరకాలు. వాటిని మన లాభం కోసం వాడుకోవడమే మనం చేయవలసిన పని.

105) డబ్బుని కళ్ళతో చూడవద్దు. మైండ్‌తో చూడండి.

106) అర్జున్ రెడ్డి సినిమాతో ఎస్.వి. కృష్ణా రెడ్డి సినిమాలకు కాలం చెల్లింది. (ఇది రాయడం నా కిష్టం లేదు)

107) ఒక వ్యక్తి నడవడికను తెలుసుకోవాలంటే అతనితో కలసి కొన్ని రోజులు భోజనం చెయ్యి.

108) When you are good at something, do not sell it for free.

109) అలవాట్లను మార్చుకోలేం రోగాలను ఓర్చుకోలేం.

110) మన దగ్గర డబ్బు ఉందని తెలిస్తే, చుట్టూ ఉన్న వారికి అవసరాలు పెరుగుతాయి.

111) తిండికి బానిస నియమం పాటించండి. తక్కువ తినండి, ఎక్కువ పనిచేయండి. (తద్వారా ఆరోగ్యంగా ఉండండి)

112) ఒక్క పేకాటలో మాత్రమే ఆట గెలిచినవాడు మౌనంగా ఉంటాడు (అంటే జీవితంలో సక్సెస్ వచ్చినప్పుడు మౌనంగా ఉండండి)

113) అందరితో 'మంచివాడ'ని పించుకునేవాడు ఎందుకూ కొరగాని వాడు.

114) పక్షులు నా నెత్తి మీద ఎగురకుండా ఆపలేను కానీ, అవి గూడు పెట్టకుండా ఆపగలను.

115) నిజానికి దురదృష్టవంతులే అదృష్టవంతులు, ఎందుకంటే, అదృష్టవంతుడికి తన సామర్థ్యం గురించి తనకు ఏమీ తెలియదు.

116) దసరా మామూళ్ళు, దలారులు లేకుండా కష్టమర్ జేబు నుంచి బయటకి వొచ్చిన ప్రతి పైసా ఓనరు అకౌంట్‌లోకి జమ అయ్యే పద్ధతినే కార్పొరేట్ అని అంటారు, (ఇది నా నిర్వచనం) అందుకే కార్పొరేట్ ఆఫీసులలో పనులు సజావుగా అయినట్లు అనిపిస్తాయి

117) అబద్ధం చెప్పడం వలన మానసికంగా అలసిపోతాం.

118) దరిద్రమైన ఉల్లేఖనం, మంచివాళ్ళకే కష్టాలు వస్తాయి.

119) గతాన్ని అర్థం చేసుకోవడం తేలిక, భవిష్యత్తుని దర్శించడం సులువే కానీ వర్తమానాన్ని గ్రహించి, ఆస్వాదించడం మస్తిస్కానికి – అబ్బో చాలా కష్టం.

120) మగవారికి రెండు భయాలు ఎప్పుడూ వెన్నాడుతూ ఉంటాయి. గుండెపోటు వొస్తుందేమోనని, పటుత్వం పోతుందేమోనని.

121) ఓ దేవుడా! నాకొక శత్రువును ప్రసాదించు. (ఎందుకంటే శత్రువు నన్ను కరెక్ట్‌గా విమర్శిస్తాడు.)

122) జాగ్రత్తగా గమనిస్తే మనకక్కరలేనిదే, ఇచ్చినా పర్వాలేనిదే, మనం ఇచ్చి, దానినే దానగుణం అని పిలుచుకుంటాం.

123) మన:శాంతి కోసం యుద్ధ ప్రాతిపదిక మీద చెయ్యవలసిన పనులు. IMPORTANT BUT NOT URGENT - WORKS.

124) మానవుడు నమ్మే అత్యంత పెద్ద అబద్ధం దేవుడు.

125) నామవాచకం(Noun) ఎదగదు, విశేషణం (Adjective) ఎదుగుతుంది. ఉదాహరణకు దేవుడు, దైవత్వం.

126) పెద్దలను గౌరవించ వద్దు, వారి (మంచి) ప్రవర్తనను గౌరవించండి.

127) అంత: మనస్సులో పూర్తిగా విజయం నిండిపోతే, బాహ్య పరిస్థితులు సహజంగా మారిపోయి సహకరిస్తూ, అదృష్టాన్ని తలపిస్తాయి.

128) నీ కోరికే నాకు ఆజ్ఞ, అలా బ్రతకడం కొరగాని తనం. (అంటే మన చుట్టూ వున్నవారు నిర్దేశిస్తారు మనం ఎలా బ్రతకాలీ అని)

129) ఎక్సర్ సైజ్ చేస్తే ఆయాసం రావాలి. (చమట రావడంతో సంబంధం లేదు)

130) భూత వైద్యులు రూపాంతరం చెంది, సైకలాజికల్ కౌన్సిలర్లుగా మారేరు. జాగ్రత్త!

131) Happiness is an attitude. సంతోషంగా ఉండడం అనేది ఓ సంకల్పం.

132) అవసాన దశలో అందరిని కలచి వేసే సమస్య "నేను–నాకు కావలసినట్టు జీవించలేకపోయానే" అని.

133) ఆలోచనలు పరిమితమైతే అవకాశాలు పరిమితమౌతాయి.

134) విజయం అనేది అభూత కల్పన. జీవితంలోను, సెక్స్‌లోను (రెండిటిలోనూ).

135) అనుభవానికి మించిన శిక్షణ ప్రపంచంలో ఎక్కడా దొరకదు. కాబట్టి అనుభవంతోనే మనిషి ప్రభావితం అవుతాడు.

136) తియ్యటి NOSTALGIA(అద్భుతమైన జ్ఞాపకాలు) ఉన్నవాడే ధన్యజీవి. దానినే జీవిత 'విజయం'గా ప్రకటించుకోవచ్చు.

137) సంవృద్ధిగా డబ్బును సంపాదించండి. అప్పుడు psychology, adjustment, understanding మొదలగు బాధలు తప్పుతాయి.

138) రెండు ప్లాన్‌లు ఉన్నప్పుడు, ఎప్పుడూ ప్లాన్ బి మాత్రమే పనిచేస్తుంది.

139) నిజమైన దైవభక్తి ఏర్పడడానికి సైన్స్‌కు మించిన సాధనం లేదు.

140) ఏడవకు. ఎందుకంటే సంఘటన జరిగిపోయింది.

నవ్వు. ఎందుకంటే సంఘటన జరిగిపోయింది.

141) తప్పు అని తెలిసినా పిల్లలకు Over Achievement అనే dietను ప్రతి రోజూ పెడుతూ ఉంటాం.

142) పర్వతారోహణలో ఒక తప్పు చేస్తే, అదే ఆఖరి తప్పు.

143) ఆర్గనైజేషన్‌ల లోను, బ్యాంకుల లోను కాకుండా ప్రక్కవాడి దగ్గర అప్పులు చేస్తున్నంత కాలం పేదవాడి గానే మిగిలిపోతాం.

144) ఏ మాత్రం మార్పునకు ఇష్టపడకపోవడమే ముసలితనం.

145) విజయం ఒక పాఠం అనుకుంటే ఆ పాఠం నేర్పేది వైఫల్యం మాత్రమే. Failure teaches us to be successful.

146) సుమారుగా అందరూ వాస్తవాన్ని చూడడానికి, వాస్తవాన్ని భరించడానికి ఇష్టపడరు.

147) గతం తల్చుకొని పిలక పీక్కునేవారు ఎక్కువ డబ్బు సంపాదించలేరు.డబ్బు వర్తమానంలోను, భవిష్యత్తులోను మాత్రమే ఉంది.

148) నాకు డబ్బు అవసరం లేదనుకున్న వ్యక్తి, అందని ద్రాక్షపళ్ళ దగ్గర నక్కలాంటివాడు.

149) ప్రతి వ్యక్తి తన అసమర్ధపు దిశలో ఎదుగుతాడు. అంటే కంఫర్ట్ జోన్‌లో ఉన్నాడని అర్ధం.

150) విజయవాడ 'కార్ల్ మార్క్స్ రోడ్' లో అన్ని ఎత్తయిన భవంతులు, షాపులే.

151) మనుష్యులందరికి ఉన్న మానసిక దౌర్భల్యం.. గొర్రెదాటు మనస్తత్వం.

152) డబ్బు ఖర్చు పెట్టడానికి కావల్సింది ధైర్యం.

153) నిధి ఉంటే రాముని సన్నిధిని సుఖముగా చేరుకోవచ్చు.

154) నా కష్టాలు వాస్తవాలు, నీ కష్టాలు కల్పితాలు. ఇదీ మన ఆలోచనా ధోరణి.

155) భార్య భర్తలు రూం మేట్లు లా ఉండాలి. ఈ విషయం ఎంతమందికి తెలుసు? ఒకరి కప్పు ఒకరికి అందించుకోవాలి కానీ ఒకే కప్పులో ఇద్దరూ తాగకూడదు.

156) మీ గోల్/ ధ్యేయం ఒక్క అడుగు దూరంలోనే ఉంది. గమనించుకోండి.

157) మన జ్ఞానాన్ని పెంపొందించుకోకుండా ఇతరుల జ్ఞానాన్ని చూసి ఆనందించడమే మన అజ్ఞానం.

158) అనేక కాలక్షేప మార్గాలు కాల సర్పాలు. వాటి యొక్క కాటే విజయ భ్రాంతికి నాంది.

159) ఒక హాయి అయిన మాట ఎంత పెద్ద ఎండా కాలాన్నయినా చల్లబరుస్తుంది.

160) డాక్టరు తుది వరకు వినగలిగితే, రోగ నిర్ధారణ రోగే చేసుకుంటాడు.

161) ఫలానా తారీఖు నుండి సిగరెట్లు మానేస్తానన్నప్పుడు, అంతకు ముందు నుంచే మానేయడం ప్రారంభించాలి. అలాగే చదువు ప్రారంభించడం కూడా.

162) ఎప్పుడైనా వెధవ పని చేసినా లేదా నేరం చేసినా దాన్ని అసలు గుర్తు తెచ్చుకోక (గుర్తు తెచ్చుకుంటే అది విజయభ్రాంతి అవుతుంది.)

163) లాటరీ కొట్టాలంటే ముందుగా లాటరీ టికెట్టు కొనాలి.

164) కష్టపడి కొన్ని వ్యసనాలు అలవాటు చేసుకోండి. డబ్బు సంపాదించడం, హ్యాపీగా ఉండటం, ఎంజాయ్ చేస్తూ ఉండటం, ఇలా.....

165) ఎటువంటి భర్త అయినా ముఖ్యమైన నిర్ణయాలు భార్యకు చెప్పే తీసుకుంటాడు.

166) పిల్లలను కనాలి గాని, వారి జీవిత నిర్ణయాలను కనకూడదు. (అంటే కూతురు డాక్టర్ అవ్వాలి మొదలగు నిర్ణయాలు తల్లితండ్రులవి కాకూడదు)

167) భూమి మీద అత్యంత ఖరీదైన జాగా స్మశానం. ఎందుకంటే మేధావులు, సంపన్నులు (మనకి వారి మేధావితనం యొక్క రహస్యం చెప్పకుండా) అంతరించేది అక్కడే!

168) ట్రాఫిక్‌ను అష్టదిగ్బంధం చేసి మనల్ని ఆలోచించనివ్వకుండా చేస్తోంది ప్రతి ప్రభుత్వం.

169) మనం మాట్లాడే ప్రతి మాటకు ఖచ్చితమైన అర్థం తెలుసుకుంటే మన ఆలోచనలు మనకు తెలియకుండా ఉన్నతం అవుతాయి.

170) మధురమైన సంఘటనల పరంపరే జీవితం.

171) నా జీవితంలో అపజయాలు ఉండవు, ఫలితాలు మాత్రమే ఉంటాయి.

172) నమ్మకంలేని చప్పటి ప్రార్థనలు మార్పునకు దోహదపడవు.

173) ఏం చెయ్యాలో అందరికీ తెలుసు, కానీ కొద్దిమంది మాత్రమే తెలిసింది చేస్తారు.

174) నాలో చలనం లేకపోతే నేను నిర్ణయం తీసుకోలేదన్నమాట.

175) దేవుడు ఆలస్యం చేస్తాడేమో గాని అసంభవం చెయ్యడు.

176) మనిషిని వొత్తిడి చేసి నిరంతరం ముందుకు నడిపించే బలాల పేర్లు : బాధ, ఆనందం.

177) ఈ కష్టం నాకే రావాలా అని అనుకోవడం కంటే, నేనైతే ఈ కష్టాన్ని ఎలా ఎదుర్కుంటాను అని అనుకోవడం పాజిటివ్ థింకింగ్.

178) సాకులు చెబుతున్నంత కాలం పరిమితంగానే ఉంటాం.

179) అదృష్టం ఎప్పుడూ మీ వెంటే ఉంటుంది.

180) గొప్పవారు అసెట్ల కోసం పాటుపడతారు! పేద, మధ్యతరగతి వారు లగ్జరీల కోసం ఆరాటపడతారు.

181) ఉద్యోగం తప్పనిసరి స్థాయి నుండి ఇష్టపడే స్థాయికి మార్చుకోండి.

182) కొత్త ప్రయోగం ఖర్చుతో కూడుకున్నది.

183) స్వేచ్ఛా, స్వాతంత్ర్యలంటే నిజమైన అర్థం తెలుసుకో.

184) ఉద్యోగస్థులను మాత్రమే తయారుచేసే సంస్థ విద్యాలయం.

185) డబ్బు సంపాదించకముందే ఆ డబ్బుని ఎలా వినియోగించాలో నిర్ణయించుకో.

186) లివరేజ్ అంటే తక్కువ శ్రమతో ఎక్కువ సంపాదించడం.

187) నెగిటివ్ ఆలోచన అంటే నువ్వు చెయ్యలేవు, అది చాలా రిస్క్, ఈ మాత్రం ఆలోచన మిగిలిన వాళ్ళకి రాదా అని ఆలోచించడం.

188) వర్తమానంలో జీవించండి.

189) మార్పునకు ఇష్టపడనివారు చెప్పేది “పాత కుక్క కొత్త ట్రిక్కులు నేర్చుకోలేదు”.

190) రొటీన్ ఆలోచనా విధానాన్ని మార్చుకొనే సమయం ఆసన్నమైంది.

191) మధ్యతరగతి ప్రజలు కలలు కనడం మానేసారు. ఎందుకంటే కలలకు ఖర్చు అవుతుంది. అందుకనే మధ్యతరగతిగా మిగిలిపోతున్నారు.

192) మతం, రాజకీయాలు, సెక్స్ మరియు డబ్బు గురించి చర్చించవద్దు అంటుంది సాంప్రదాయ విద్య.

193) టైం లేదనేకంటే ఇంట్రస్ట్ లేదనటం సరియైన సమాధానం.

194) డబ్బు బిజినెస్‌లో ఉండదు. దాన్ని మేనేజ్ చేసే లీడర్ల దగ్గర ఉంటుంది

195) టీవీ చూస్తున్నంత కాలం టీవీలో ఎప్పటికీ కనపడలేరు.

196) మన చుట్టూ డబ్బు పోరలాగ కనపడకుండా ఉంటుంది. మన ఆలోచనా సాంద్రత బట్టి అది మనకు లభ్యం అవుతుంది.

197) నీ కంటే తెలివైన వాళ్ళకి నీ క్రింద ఉద్యోగం ఇవ్వు.

198) నాలోని మార్పు సాధ్యమా?

199) పేద, మధ్యతరగతి ప్రజల అంత: వాస్తవం డబ్బు సరిపోకపోవడమే.

200) నాలో తప్పు ఉండవచ్చు అని అనుకోవడానికి నామోషి పడవద్దు.

201) అంత: వాస్తవం అంటే తల్లిదండ్రులు, సంఘం నీ మెదడులో ఎంత డబ్బు పెట్టేరని!

202) ఆర్థిక విలువ పెరిగే వస్తువులని గుర్తించండి.

203) జీవితంలో తమకి అడ్డు వచ్చిన సంఘటనలే ఉదాహరణలుగా విజేతలు, అవిజేతలు చెబుతారు.

204) డబ్బు 'మీ గురించి' పనిచేయడం ఓ వింతైన అనుభవం.

205) వ్యక్తిగత విజయం కంటే నైతిక విలువలున్న విజయం గొప్పది.

206) ఈవేళ పని ఈవేళే చేయకుండ సహాయపడేది - రేపు.

207) వ్యాధులు రావడానికి, పెరగడానికి కారణం ఇష్టమైన పనిని గుర్తించలేక పోవడమే!

208) జీవితాంతం కష్టపడి, చివరకు చెప్పేది టైమూ, డబ్బు సరిపోలేదని!

209) విజయం భ్రాంతికి లోనౌతున్నారేమోనని జాగ్రత్తగా పరిశీలించుకోండి

210) రిస్క్ తీసుకోవడం నేర్చుకోవడంలో ఒక భాగమే.

211) నా అర్హతలకన్నా తక్కువ స్థాయికి స్థిరపడిపోను.

212) చిన్న విషయాలల్లో ఎదుగుదల సాధిస్తాను.

213) ఉన్నత వ్యక్తుల జీవితాల్లో ఉన్న తేడా గుర్తించి, ఆలోచిస్తాను.

214) జీవితం మీద నేను వెంటనే కంట్రోల్ (సాధికారత) సాధిస్తాను.

215) ఎక్కడా ఉచితంగా భోజనం దొరకదు.

216) బిజినెస్‌లో ఇన్వెస్ట్ చెయ్యడానికి కావలసింది ముందు టైమ్, తరువాత డబ్బు.

217) నా జీవితపు ముద్ర నేను చనిపోయాక కూడా ఉంటుందా?

218) నా జీవితాన్ని పూర్తిగా మార్చేయడానికి ఒక్క సంఘటన చాలు!

219) నేను ధైర్యంగా కనే కలలు నిజం చేసుకునే శక్తి నాలోనే ఉంది.

220) నాలో నిక్షిప్తమైన శక్తిని వెలికి తీసే సామర్ధ్యం నాలోనే ఉంది.

221) నన్ను నేను మోసం చేసుకోను.

222) Disappointment నుండి తప్పించుకోవడానికి మాత్రమే మార్పు కోరను.

223) నా పళ్ళతో నేనే సమాధి త్రవ్వుకోను. (అంటే ఆహార జాగ్రత్తలు తీసుకుంటాను.)

224) ఓ పది సంవత్సరాల క్రితం నేను ఎక్కడ ఉన్నాను. అప్పటి నా కలలు, కోరికలు ఏమిటి?

225) నా జీవితంలో విప్లవాత్మకమైన మార్పు రావడానికి నాకు ఓ సంవత్సరం చాలు.

226) నన్ను నియంత్రించేది నా నిర్ణయాలు కాని నా పరిస్థితులు కావు.

227) (ఏదైనా సమస్య వొస్తే) నేను దారైనా కనుక్కుంటాను లేదా ఏర్పరుస్తాను.

228) అనతికాలంలో ఇచ్చె తియ్యదనం ఆనక సమస్య అవుతుందని నాకు తెలుసు.

229) నింపాదిగా నిర్ణయాలు తీసుకునేవారు త్వరగా మనస్సు మార్చేసుకుంటారు.

230) నష్టపోతానేమో నన్న భయం, లాభపడతానన్న కోరిక కంటే బలమైనది.

231) చాలా మంది తమకున్న దాన్ని కాపాడుకోవడానికే ఎక్కువ కష్టపడతారు. దానికే హార్డ్‌వర్క్ అని పేరు పెడతారు.

232) నా చేతల యొక్క మూలాలు నా అంత: మదిలో దాగి ఉంటాయి. వాటిని సరిగా కనుక్కోగలిగితే మొదట నా ఆరోగ్యం బాగుంటుంది.

రెండు నా ఎనర్జి లెవెల్ పెరుగుతుంది.

మూడు నా మానవ సంబంధాలు బాగుంటాయి

233) చుట్టూ ఉన్న వాతావరణం నా గమ్యాన్ని నిర్దేశిస్తూవుంటే, నేను జంతువుతో సమానం.

234) నేను తినే భోజనం నా శరీరానికి ఇందనం ఇవ్వాలి తప్ప, నా మనస్సుకి ఆనందం కాదు.

235) నేను నా మనస్సుకి ఇష్టమైన పనులు మాత్రమే చేస్తాను. భోజనం విషయంలో తప్ప.

236) ఒక సంఘటన నా జీవితాన్ని మార్చదు. నాకున్న నమ్మకాన్ని ఆ సంఘటన ప్రభావితం చేస్తుంది.

237) నేను మార్పుకోసం, తాత్కాలిక ప్రయత్నాలు చెయ్యను.

238) వృద్ధి చెందలేనిది ఏదైనా నశిస్తుంది.

239) నాలోని శక్తిని బయటకు తీయగలిగినవాడే నా ప్రియ మిత్రుడు.

240) విజయం అంటే ఓటమి నుంచి ఓటమికి మధ్య ప్రయాణం.

241) ఈ జీవితం మీది, మీకిష్టం వచ్చిన రీతిలో దీన్ని నడపండి, పోలిక మాత్రం వద్దు.

242) ఓటమి ఎదురైతే మంచి అనుభవం వచ్చిందనుకోవాలి.

243) నాకు కోపం వచ్చే అవకాశం ఎవ్వరికి ఇవ్వను (నాకు కూడా).

244) ప్రతి సంఘటనకు మనని పాడుచేయడానికి ఎంతటి శక్తి ఉందో, బాగు చెయ్యడానికి అంతే శక్తి వుంది. (Sorry this is repeated)

245) గమ్యం లేనివారు విజయభ్రాంతికి లోనవుతారు.

246) ఓటమి నువ్వు ఇంకా విజయం సాధించలేదని మాత్రమే చెబుతుంది.

247) విజేతలు నిష్క్రమించరు – నిష్క్రరులు ఎప్పటికీ విజేతలు కాలేరు.

248) స్థిరమైన వ్యక్తి అంటే ఓటమినే ఎప్పుడూ గుర్తు తెచ్చుకునేవాడు.

249) దేవుడు ప్రత్యక్షమైతే ఏమి కోరుకుంటారో అదే మీ గోల్.

250) ఫలితం మీద మీకు అధికారం లేదు.

251) ప్రతి చిన్న మార్పు కూడా విజయమే.

252) 'నేను' అనే మాటను మీ మాటలలో పూర్తిగా తొలగించండి.

253) రెండేసి మెట్లు ఎక్కండి, రెండు మాత్రలు కలిపి వేసుకునే అనారోగ్యం నుంచి తప్పించుకోండి.

254) గెలవడానికే పుట్టేరు.

255) ఆరోగ్యంగా ఎందుకు ఉండాలంటే, సంపాదించిన డబ్బును ఎంజాయ్ చేయడానికి

256) పొందేవా...! పోతుంది.

257) ఎంజాయ్ చేయడం అంటే ఖచ్చితమైన అర్థం తెలుసుకో.

258) బాల్యం వెళ్తుంది, యవ్వనం వెళ్తుంది, కౌమార్యం వెళ్తుంది. కానీ ముదిమి వెళ్ళదు.

259) డబ్బు మాట్లాడుతుంది. మిగిలిన నడిచి వెళ్ళిపోతాయి.

260) ఆశ – బ్రోకర్, భయం – జ్యోతిష్కుడు, గుడ్డ పరిస్థితి – మాయ ..........ఇవన్నీ కవల పిల్లలు.

261) నీకు కావలసిన బలం, బలగం అన్నీ నువ్వే. శక్తి కోసం చేతులు చాచడం మానుకో నీలోనున్న శక్తిని చేతుల్లోకి తీసుకో.

262) మగవాడు ఇద్దరితో ముగ్గురితో తిరుగుతున్నాడన్న విషయాన్ని స్త్రీ భరించగలదు. అయితే స్త్రీ తిరుగుతోందంటే పురుషుడు చస్తాడు కాని భరించలేడు.

263) డబ్బు కోసం ఒక పని చేస్తున్నప్పుడు కష్టపడుతున్నాను అని ఫీల్ అవ్వడం ఆరంభిస్తే, అంతే! డబ్బు ఉత్పత్తి భయంకరంగా కుంటుపడుతుంది. గమనించుకోండి.

264) Safety Measures ఎప్పుడూ చాదస్తంగానే కనపడతాయి

265) చాలా మంది, తమ జీవితాల్లో దానంతటదే మార్పు రావాలని కోరుకుంటూ సుఖప్రదమైన జీవితం కోసం, ఇసుమంతైనా ప్రయత్నం కూడా చెయ్యరు.

266) సంపద ఎల్లప్పుడూ ఆహ్లాదాన్ని సృష్టిస్తుంది.

267) బీదరికం గురించి బాధ పడడమే చాలా మంది చేసే తప్పు. (ఎందుకంటే, ఏది ఎక్కువ ఆలోచిస్తే అదే జరుగుతుంది.)

268) ఒక్కసారి డబ్బు రావటం మొదలు పెడితే అది ప్రవాహం లాగా, ఉప్పెన లాగ వచ్చేస్తుంటుంది. ఇంత డబ్బు ఈ ప్రపంచంలో ఇంత కాలం ఎక్కడుందా అని మనం ఆశ్చర్యపడేలాగ మనల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది.

269) జీవించడం అంటే బ్రతకడం కాదు. నిరంతరం ఒక కుతూహలంతో, ఆనందంతో, ఉత్సాహంతో మరుసటి రోజు కోసం బ్రతకడం.

270) మనం బద్ధకస్తులం కాం, నపుంసకపుగోల్స్ పెట్టుకుంటాం. అంతే!

271) జీవిస్తున్నది జీవితంలో నిమగ్నమై కాలాన్ని మరచిపోవడానికే! గెలుపు ఓటముల కోసంకాదు.

272) బ్రతికిన నాలుగు రోజులు తెలివిగా, జ్ఞానంగా, వాస్తవిక దృక్పథంతో బ్రతకండి.

# రవి కిషోర్ మల్లాప్రగడ

# మరో రచన




# 40 తరువాత సెక్స్...?









మీ భార్య ఎలా ఉండాలి?
మీ తెలివితేటలు అర్థం చేసుకొనే తెలివిగలదిగాను
మీ తెలివితేటలే గొప్పవనుకునే తెలివి తక్కువగాను ఉండాలి

మీ భర్త ఎలా ఉండాలి?
నా స్వరం వినే శ్రీరాముడి గాను
నన్నే సర్వస్వం అనుకునే శ్రీకృష్ణుడిగాను ఉండాలి



| | | |
|---|---|---|
| **Name** | **:** | **Ravi Kishore Mallapragada** |
| **E-Mail** | **:** | **ravikishorem@yahoo.com** |
| **Whatsapp** | **:** | **+966501446104** |
| **Qualification** | **:** | **Ph.D. Mathematics** |
| **Working** | **:** | **Asst. Professor, Yanbu Industrial College, Saudi Arabia** |
| **Interests** | **:** | **Psychology, Movies, Music, Travel, Adventure** |
| **Previous Books** | **:** | **1. Is job injurious to Wealth? (Telugu)** |
| | | **2. Gireesam Master (Telugu)** |
| | | **3. Money Management (Telugu)** |
| | | **4. Faulure Design (Telugu)** |
| **Living at** | **:** | **Visakhapatnam** |
| **Genre** | **:** | **Personality Development** |

*** Free Download at kinige.com**